ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక

హేవిళంబ సంవత్సరము మార్గశిర - పుష్య మాసములు

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౭ } హేవిలంబి సంవత్సరము మార్గశీర్ష - పుష్యమాసములు { సంచిక ౫

# ఛందోదర్పణము - కొన్ని విశేషములు

శ్రీ భట్టాచార్య

## 18. రీ విరమము

అనంతుఁడు తన ఛందోదర్పణమునందు ఋకారస్వరూపయతి నిట్లు చెప్పినాఁడు.

గీ. క్షితి ఋకారరూపస్వరయతులు బరఁగు
ఋగ్యజుస్సామవినుతుండు కృష్ణుఁ డనఁగ
వృష్ణికులజుండు కరుణాసముద్రుఁ డనఁగ
హేమపీతాంబరుండు దేవవృషభుఁ డనఁగ.

("హేమపీతాంబరుండు" అని దువర్ణకమునకు ముందుఁ బూర్ణ బిందు వున్నది. అట్లున్న గణభంగము కాఁగలదు. "హేమపీతాం బరుఁడు" అని అర్ధబిందువే యుండవలయును.) ఋకారస్వరూప యతిలో మూఁడువిధములైనవానిని అనంతుఁడు చూపించినాఁడు. (1) ఋకారమునకు కాదులపైనుండు ఋకారమునకును, (2) హల్లుల మైత్రి లేకున్నను ఋకారసంబంధమునుబట్టి వృ- మృ లవంటివానికిని (ఇట్లే యితరహల్లులకును) (3) "హేమపీతాంబరుఁడు" లోని హేకార మునకు, "వృషభుఁడు" లోని వృకారమునకు యతులు సెప్పినాఁడు. వీనికే అప్పకవి ఋత్వసామ్య, ఋత్వసంబంధవళు లని పేరుపెట్టినాఁడు. అనంతుఁ డీ ఋకారస్వరూపయతులు సెప్పినతరువాత రీ విరమము సెప్పినాఁడు. ఈ రీ విరమమునుగూర్చి యభిప్రాయభేదము లున్నవి.

కొందఱుపండితులు "రీవిరమము" కాదనియు నయ్యది "ఋవడి" యనియుఁ జెప్పుచుండిరి. కాని యయ్యది పరిశీలనాభావజనితాభిప్రాయ మని తోఁచెడిని. ఎందువల్లనన రీవిరమము చెప్పు పద్యమునందుఁ బాఠ్య భేదము లున్నను తరువాతి 88, 89 వ పద్యములు, 87 వ పద్యము నందలి "రీతోడి విరతి తలకొన డెందుక" అనువాక్యము "ఋవడి" కాక "రీవిరమణము" అని బలపఱచుచున్నవి. అనంతుఁడు చెప్పినదానికి నితరపండితులు చెప్పినదానిని క్రమముగాఁ జూపించుచు దాని దూరా పాస్తము చేయు నుదాహరణములను ఛందోదర్పణమునుండియే చూపించెదము.

ఋ రు ఌ లు యతి- "అనంతుఁ డీయతిని స్పష్టముగా నీక్రింది పద్యములలో నాదేశించినాఁడు.

కం. విలసదృకారమును వ
క్రులు విరమణ మొందు శౌరి ఋషులకు శశ్వ
త్సులభుఁ డనఁగ నీ రే లకుఁ
దలపడ రీతోడివిరతి తలకొన డెందుక.

(ఈ పద్యమునందు "విలసదృకారము" 'దృ' అని వట్రువసుడితో నున్నది. ఈ వట్రువసుడికి ముందున్న సకారము నూఁదఁగలదా? ఋకారము- అచ్చువంటి దనియు దానికి నూఁదునట్టిశక్తి లేదనియు ననంతుఁడు తన ఛందోదర్పణమునందుఁ దెలిపియున్నాఁడు. చూడుడు-

కం. ఉపరిని హల్సంయుత మై
నపు డూఁదును స్వరసమన్వితాక్షర మగు నే
నపు డూఁద దాదివర్ణము
ప్రపాద్యయమ్ము, పరిష్కృతంబు, పరిక్లృప్తి యనక.

(ఈపద్యమునందలి చివరిపాదములో "ప్రపాద్యయమ్ము" అని మాముడి యున్నది. అట్లున్న గణభంగము కాఁగలదు. 'ప్రపా ద్యయము' అనియే యుండవలయును.)

పరిష్కృతంబు, పరిక్లృప్తి- ష్కృ. క్లృ లకు ముందున్న రివర్ణ మూఁద లేదుగదా. అట్లే 'విలసదృకారము' అనునపుడును దృకారమునకు

ముందున్న సకార మూఁదఁబడ లేదు. అందువలన గణభంగము తప్పక కలుగుచున్నది. అనంతుఁడు చెప్పినది 'ఋవడి' అని చెప్పఁబూనినవారు దిద్దుటకుఁ బూనుకొని వర్తువసుడిగా నుంచిరి. అది వారిమతము నను సరించి "ద్రు" అని యుండవలయును. అనంతుఁడు చెప్పినదానినిబట్టి 'ద్రి' అని యుండవలయును.

గీ. మును ఋకార మిా యే లతో నొసరినట్లు
చేర దొకట యణాదేశ కారణమున
ఘన లకారంబ యగు స్వరల్గారవిరతి
క్లృప్తి లేదు శౌరిగుణావళుల కనంగ.

కాని యప్పకవి యీయతులను సంగ్రహింపకపోవుటచేతను, ఋకారమునకు ఇ ఈ ఎ ఏ ల తోడను, రి రే లతోడను యతుల నాతఁడు చూపుటచేతను నీయనంతుని ఛందోదర్పణములోని పై పద్యము లిట్లు మార్పు గావింపఁబడినవి.

విలసదృకారమును మఱి
రి లలి విరమణ మొందు శౌరి ఋషులకు

అనియు-

'క్లృప్తి లేదు శౌరిగుణావళికి ననంగ'

అనియు నప్పకవీయానుగుణముగా మార్పు చేయఁబడినది.

విలసద్రికారమును వ
ట్రిల విరమణ మొందు శౌరిఋషులకు-
(అని పూర్వముద్రితము)

అనంతుఁ డీవడిని తా నాదేశించుటయే కాక తన భోజరాజీయమునందు దానిని వాడియున్నాఁడు.

సీ. గృహధర్మనిరతులు కొనివచ్చి భక్తిపూ
ర్వకముగా (ఆ. 3. ప. 27.)

భాస్కరరామాయణమునుండి కొన్ని చూపుచున్నాను-

1 కొని యల్లన కాలనేమి గృహమున కరిగెఁ (యు. కాం. 1617)

2 సురనదిపేఁచులం దడియుశృంగములఁ (...2527)
3 క్రూరాస్త్ర చంద్ధార్ధకృత్తోరుబాహులై (1456)
("చంద్ధార్ధ" అని ధకారమునకు వత్తున్నది పొరపాటు.) పాఠములు మార్చినవి చూడుఁడు.
(1) పృథివి బగిల్చి బంగరపుఁ బింజలయమ్ము.
(అచ్చుపాఠము 2015)
పుటక్రింది పాఠము-
పృథివి బగిల్చి హేమమయపుంఖశరంబులు
(2) పృథుతరవిస్మయక్రమము పెంపొనరింపఁగఁ జూచి
(అచ్చుపాఠము)
పృథుతరవిస్మయక్రమము బొందిరివోవఁగ
(పుట క్రిందపాఠము-595)
మడికి సింగన వాసిష్ఠరామాయణము :—
తృణకణాంశంబు వజ్రమై తుంచునట్లు (ఆ. 3. ప. 230)
కర్తృత్వమును వెలింగి తోఁచుచుండు (ఆ. 3. ప. 12)
గౌరన నవనాథచరిత్ర :—
తొడరి దొప్పఁగ దోగి ధృతి దుప్పఁ దూలి (2-57)
నృపునితో నొంకు రెణ్డను గాఁగఁ జెప్పి.
(తెలుఁగుపదమైన 'రెండు' అనుదానికి 'రెణ్డు' అనియుండుట పొరపాటు.)
అహోబలపతి కాళిందీకళ్యాణము-
మృదువైన చేతులు ముండ్లపొదలు-
ఇన్నిప్రయోగము లున్నను వైయాకరణపారిజాతమున (91 పుట) వత్రులు విరమణ మొందు శౌరి ఋషులకు శక్వల్ (అముద్రిత ఛం. ద.) అని యిట్లు ఋ వర్ణముతో రు వర్ణమునకు యతి చెప్పఁబడినది. 'కవిప్రయోగములు దొరకనందున సరికాదని ముద్రణముతో దిద్దివేసిరి' అని యుండుట వింతగ నున్నది అని శ్రీ నిడుదవోలు వెంకట

రావుగారు ఛందోదర్పణ ద్వితీయముద్రణపీఠికలో వ్రాసిరి. ఋ వడిని రు వడి యని నిర్ధారించుటకు శ్రీ వెంకటరావుగారు కొన్ని యసందర్భమైన యుదాహరణము లిచ్చిరి. ఆ యుదాహరణములు చూడఁగనే మాకుఁ జాల ఆశ్చర్యము కలిగినది. అనంతుఁడు చెప్పిన పద్యములను బట్టిచూడ మాకు రువడిగా కాక ఋవడిగాఁ గనపడుచున్నది. పోనీ వెంకటరావుగారు ఉదాహరణముగా నిచ్చిన పూర్వకవిప్రయోగములందు రువడిని బలపఱచుటకు నెన్నితగియున్నవో చూతము.

క్రూరాస్త్రచంద్రార్ధకృత్తోరుబాహులై
తృణకణాంశంబు వజ్రమై త్రుంచు

క్రూ- కృ, తృ- త్రు. ఈరెండు ఉదాహరణములుమాత్రమే వారి రువడిని బలపఱచుచున్నవి. మిగిలినవన్నియు హల్మైత్రి కుదిరినపుడు వట్రువసుడికి (కృ తృ మున్నగువాని ఋకారమునకు) ఉ ఊ ఒ ఓ లతోడ మైత్రి తెలుపుచున్నవి. పరికింపుఁడు—

గృహధర్మనిరతులు కొనివచ్చి భక్తిపూర్వకముగా
గృ- కొ లకు యతి.

కర్తృత్వమును వెలింగి తోఁచుచుండు
(క) ర్తృ- తో లకు యతి.

తొడరి దొప్పగఁ దోగి ధృతి దుప్పఁ దూలి
తో- ధృ లకు యతి.

మృదువైన చేతులు ముండ్లపొదలు
మృ- ము లకు యతి.

పృథివిఁ బగిల్చి హేమమయపుంఖశరంబులు
పృ- పు లకు యతి.

ఈపైన చూపిన వన్నియు రు వడిని తెలుపుటలేదు కదా. పై ప్రయోగములన్నియు నంగీకరించువారును గలరు. కాన వానికి ప్రత్యేకముగా లక్షణము చెప్పవలసి యున్నది.

ఇఁక రువడిని బలపఱచునట్టి ప్రయోగములు ప్రయోగించిన వారు పొరపడియుందు రని తోఁచుచున్నది. "క్రూర, త్రుంచు." అనునవి వత్రువసుడి కలిగినరూపము లనుకొని ప్రయోగించి యుందురు. అట్టిపొరపాటు ప్రాచీనులు, ఆధునికులును పడుచుందురనుటకు సందేహము లేదు. అందుచే ననంతుఁడు తన ఛందోదర్పణమునందు- "తెలుఁగునందు లేదు లలిఁ గ్రిందిసుడి గ్రుచ్చె, గ్రుమ్మె నాఁగ రేఫ కొమ్ము కాని" అని చెప్పియున్నాఁడు. 'క్రూర' అను సంస్కృతపదము నందును, 'త్రుంచు' అను తెలుఁగుపదమునందును క్రావడి కాక వత్రువసుడి యని భ్రమపడియుందురు. లేక వత్రువసుడి యని భ్రమ పడియుందురు. లేక అట్టిప్రయోగములు వారలకు నిష్టమై యుండి యుండవచ్చును. అందుచే కృ- క్రూ లకు, తృ- త్రు లకు యతిమైత్రి వేసిరి. ఇఁక ననంతుఁడు తన ఛందోదర్పణమునందుఁ జెప్పినది 'రివడి' యా ? లేక రువడియా ? దీనిఁ బరిశీలింతము.

కం. విలసదృకారమును వ
త్రులు విరమణ మొందు శౌరి ఋషులకు శశ్వ
త్సులభుఁ డనఁగ సీ రే లకుఁ
దలఁపఁగ రీ తోడి విరతి తలకొన దెందుఁ.

ఛందో. ప్ర. ఆ. ప. 87.

పై పద్యమునందలి మొదటిపాదమునందు "విలసదృకారము" దృకారముగాఁ జెప్పఁబడినది. అట్లున్న మేము తెలిపినట్టుల గణభంగము తప్పక కాఁగలదు. కాన "ద్రు" అని యుండవలెనా యన "రీతోడి విరతి తలకొన దెందుఁ" అను చివరిపాదమునందు రీ అని చెప్పఁబడినది కనుక "విలసద్రికారము" అని యుండవలయు నని తెలియుచున్నది. ఇఁక రెండవపాదము దాని లక్ష్యముగా నున్నది. అందు "వత్రుల" అని యున్నది. 'వత్రిల' అని యుండవలయును. ఈ మార్పునుబట్టి యాపద్య మిట్లుండును.

కం. విలసద్రికారమును వ
ర్తిల రీవిరమంబు శౌరి ఋషులకు శశ్వ
త్సులభుఁ డనఁగ నీ యే లకుఁ
దలపఁగ రీతోడి విరతి తలకొన దెందుఁ.

గీ. తెల్లముగ ఋకారము యణాదేశశక్తిఁ
గలుగు రేఫ యిత్వమునందుఁ గదిసి యతికి
నట్టి రీకి నీ యే లతో నన్వయించు
నట్టిసత్వంబు లే దది హల్లు గాక.

గీ. మును ఋకార మీ యే లతో నొనరినట్లు
చేర దొకట యణాదేశకారణమున
ఘనలకారంబ యగును, ఌకారవిరతి
క్లుప్తి లేదు శౌరిగుణావళికి ననంగ.

అనంతుఁడు 'రివడి'ని యిన్నిపద్యములందు నిరూపించియుండ నది రివడి కాదు రువడి యన చెప్పఁబూనుట మహాశ్చర్యము. 'విలస ద్రికారము' అను 87 వ పద్యమునందు ఋకారముతో రివర్ణము వడి పొసఁగుననియు నది "రివడి" యను పేరుతో నొప్పుచుండు ననియుఁ జెప్పెను. రి వర్ణము ఋకారముతో మైత్రి చెందినపుడు ఋకారముతో మైత్రిచెందు ఇ ఈ ఎ ఏ లుగూడ రి వర్ణమునకు యతిమైత్రి చెల్లవలసి వచ్చుచుండఁగా "ఈ ఏ లకుఁ దలఁపఁగ రీ తోడివిరతి తలకొన దెందుఁ" అని ఋ వర్ణముతో మైత్రిచెందు రి వర్ణముతో ఇ, ఈ, ఎ, ఏలకు యతిమైత్రి నిషేధించినాఁడు. దీనినిబట్టిచూడ స్వరయతితో సిద్ధించిన మైత్రిగల ఇ ఈ ఋ ఎ ఏ లలో ఒక్క ఋకారమునకు 'రి'వర్ణముతో మైత్రి కలదనియు, ఋకారముతో మైత్రి కలవయ్యును ఇ ఈ ఎ ఏ లు 'రి'వర్ణముతో మైత్రి నొందవనియు స్పష్టముగా విధించినట్లు తెలియుచున్నది కదా. మఱి యింతియేకాక 88 వ పద్యమునందు నట్లు ఋవర్ణముతో 'రి'వర్ణము యతి చెల్లుటకును, ఇ ఈ ఎ ఏ లు

'రి'వర్ణముతోఁ జెల్లకపోవుటకును హేతువుకూడ వక్కాణించి యున్నాఁడు. చూడుఁడు-

గీ. తెల్లముగ ఋకారము యణాదేశశక్తిఁ
గలుగు రేఫ యిత్వమునందుఁ గదిసి యతికె
నట్టి రీ కి నీ యే లతో నన్వయించు
నట్టిసత్త్వంబు లే దది హల్లు గాన.

ఛందో. ప్ర. ఆ. ప. 88.

సంస్కృతవ్యాకరణములో "ఇకోయణచి" అనుసూత్రముచేత ఋకారమునకు రవర్ణము వచ్చును. అట్టియాదేశశక్తిచే వచ్చిన రవర్ణము ఇకారముతోఁ గూడి ఋకారముతో మైత్రి నొందుచున్న దనియు, అట్టి 'రి' హల్లైనను ఋకారమును రకారసంబంధముచే హల్లును నగును. కావున ఋ కార రి కారములకు ప్రతిబంధక మేమియు లేదు. ఇ ఈ ఎ ఏ లు అచ్చులు. రి వర్ణము హల్లు. అగుటచే స్థాన్యాదేశభావము గాని సాజాత్యము గాని లేమికనుక రికి ఇ ఈ ఏ ఏ లతో మైత్రిచెందునట్టి సత్త్వంబు లేదు- అని విస్పష్టముగా నిరూపించియున్నాఁడు.

ఇఁక 89వ పద్యమునందు వివరముగా రెండుపాదములందుఁ జెప్పినాఁడు. ఋకారావస్థలో అత్త్వమే యుండుటచే స్వరయతితో ఋకారము ఇ ఈ ఎ ఏ లతో మైత్రి నొందినను ఇపుడు రకారావస్థలో యణాదేశసంబంధముచే హల్త్వము పొందుటచే రీకి ఇ ఈ ఎ ఏ లతో మైత్రి లేకపోయెను- అని పునఃపునః స్పష్టము చేసినాఁడు. కావున ఈ సంబంధమెల్ల 'రివడి'దె కాని 'రువడి' కేమాత్రము సంబంధము లేదని తేలుచున్నది. ఇట్లు అనంతునిఛందమునందు 'రువడి' కాదు 'రివడి' యని ఘంటాపథముగాఁ జెప్పుచుండ మహావిమర్శకులెల్లరు అయ్యది 'రువడి' యని యెట్లుచెప్పుచుండిరో బోధపడకున్నది.

★

# నైషధాంధ్రీకరణము

"గాంధీవి"

గీ. సయ్యాలెంతకు నేర రర్థార్థిజనులు
వీరిమనసులు పట్ట నెవ్వారితరము
కీర్తి యిటు వెల్గసంద్రు దాక్షిణ్యమునకు
దారుగల్గినఁ బదివేలు తమకుఁగలవు. (7-81)

'పాతాళబిలమునఁ బలిఁ గట్టివైచిరి' యనునది మూలానుస్మృతి. తక్కినవెల్ల దానిననుసరించి విస్తరింపఁబడినవి. 'తిత్తొల్చి విడిచిరి', 'ఎముక లేరిరి' మొదలగు పదములవలన నాపాదిల్లు మంజులత్వము వేఱ చెప్పనేల? 'మక్కికిమక్కి యన్నటులఁ' బ్రకృతశ్లోకమును సామాన్యులును నాంధ్రీకరింపవచ్చును. కాని యిట్లు మూలాతిశయమనోహరత్వకల్పనము శ్రీనాథునకే సాధ్యము.

మొత్తముపై హర్షనైషధమునందలి శ్లోకములలో సగమునకుఁ బైఁగా శ్రీనాథుఁ డాంధ్రీకరింపక విడిచినట్లు చెప్పవలసియున్నది. ఇందనౌచిత్యశంకచే వదలినవి కొన్నియు, దుర్ఘటములగుటచేఁ బరిత్యజింపఁబడినవి కొన్నియు, నీరసములను తలంపుతోడను, బ్రాలుమాలికతోడను వదలినవి మఱికొన్నియు నున్నట్లు తోఁచుచున్నది. వసుచరిత్ర విమర్శనమునం దట్టివి కొన్ని ప్రదర్శింపఁబడినవి. జతుకాష్ఠశ్లేషాదులను గొన్ని శబ్దచిత్రములను నాంధ్రీకరించు టెట్లు దుర్ఘటమో కొన్ని తెలుఁగుపదములతోడి చమత్కృతులు సంస్కృతీకరించుట యసంభవము.

## VI. తెలుఁగుపదములతోడి స్వారస్యములు :—

"పాఱుతెంచి కీరంబులు పంక్తు గఱవ
వణకుదాక్షిమిఁ జూచె భూవరుఁడు వేడ్క. (1-96)

పండ్లుకఱచుట యనఁగా ఫలములను గఱచుట, కోపముచేతఁ బండ్లు కొఱుకుట.

"నవశిరీషసుమంబులనవకమునకు
నన్నదమ్ములు పోనినీయనుఁగుదమ్ము-లు" (4-7)

'అన్నదమ్ములు' అనునది సాదృశ్యమును దెల్పు జాతీయము. "క్రేఁగంటిచూపుల గిఱికొన్న సన్నగేదంగిరేకుల కన్నదమ్ము లగుచు" ఉ. హ. 1-151.

'అన్నదమ్ములు' అనుచో 'తమ్ముఁడు' శబ్ద బహువచనము, 'అనుఁగు దమ్ములు' అనుచో 'తమ్మి' శబ్ద బహువచనము ప్రయుక్తమగుట గమనార్హము. మూలమున 'పాశా' అని మాత్రమే కలదు. (8-24) 'తమ్ములు పదానుజన్ములై తనరఁబోలు' అను వసుచరిత్ర పద్యపాదమును శ్రీ తిరుపతి వేంకటకవులు బహుప్రయాసముపై 'కనిష్ఠ సముదాయక తత్పాదకనీయాః కిమ్'' అని సంస్కృతీకరించి బయట పడవలసివచ్చినదట.

గీ. ఉవిద సోమరసంబన్న నోకిలించు
వడచిపడు నాజ్యహోమమంత్రాహుతులకు
నిచ్చ సేయఁడు మనములో నిధ్మములకుఁ
బావకుండు నేఁ డెల్లి నీపై విరాళి. (4-32)

ఓకిలించు, వడచిపడు, నిచ్చ సేయఁడు అను తెలుఁగుపదములతో శ్రీనాథుఁడు సాధించిన స్వారస్యములు సహృదయహృదయాహ్లాదకరములు. (వేదమువారివ్యాఖ్య) 'సోమాయకుప్యన్నివ విప్రియుక్తః ససోమమాచా మతిహూయమానమ్ నామాపిజాగర్తి హియత్రతత్రో- స్తేజస్వినస్తంకతమే సహంతే' (8-74) అని మూలము.

"నలపతివ్రతలైన యోఁ దలఁప నొరుని
దివిరి నిందించి యోఁ బ్రస్తుతించి యోని (4-68)

ఏను + తలఁప = ఏఁదలఁప

ఏని + ప్రస్తుతించి = ఏఁబ్రస్తుతించి

ఇందలి 'ఏ' శబ్దములు భిన్నములు.

VII అలంతి మార్పులు :—

'ముఖపద్మ మొకించుక వ్రాల్చిపల్కె.' (4-4)

'నమదాననేందుః' అని మూలము. (8-19)

పద్మమునకుఁ దగినట్లు 'వ్రాల్చి' యనుట సముచితము.

'ఆకర్ణింపుము చెప్పెద
నాకర్ణపుటాయతాక్షి యవధానమునన్' (4-18)

'ఆకర్ణయాకర్ణతటాయతాక్షి' అని మూలము (8-57) 'తట' శబ్దమునకు బదులుగా 'పుట' శబ్దము వాడినాడు. 'కర్ణపుట'మనుటయే ప్రసిద్ధము. 'ఆరణ్యపర్వశేషము, పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముగాన్' అని యెఱ్ఱన యతిస్థానముననుంచి వాడినాఁడు.

'అమరతరువుల కొదవె పుష్పముల లేమి' (4-26)

"అప్యస్య దారిద్ర్యహరాః ప్రవాళై
ర్జాతా దరిద్రాస్తరవోఽమరాణామ్. (8-67)

ఇటఁ బ్రవాళములను బుష్పములుగా మార్చినాఁడు. ఈ పద్యము (4-26) తరువాతి పద్యమున స్వతంత్రసమాసఘటనా నైపుణ్యముఁ బ్రదర్శింపఁదలఁచి యీమార్పు చేసియుండును.

'మందారతరుప్రవాళమయచింతారత్నతల్పంబులన్' (4-27)

'సౌరభములేని యట్టిపుష్పంబువోలె' (2-24)

'అపకేశినో వంధ్య వృక్షస్య' అని మూలము (2-45)

VIII శ్రీనాథుని స్వరూప స్వభావములు :—

'సంపూర్ణపూర్ణిమాచంద్రబింబంబు విడంబింపంజాలు నెమ్మొగంబునకుం గళంకాలంకారశంక నంకురింపఁ జేయంజాలు కోమలశ్మశ్రు

రాజి విరాజిల్ల (1-59) ఈ యమూలకవచనమునందలి వర్ణనము శ్రీనాథుని 'నానాగు మీఁసాల నూత్నయౌవనము' నాఁటి రూపమునకుఁ బ్రతిబింబమైయుండునని తోఁచుచున్నది.

'వానిఁ బ్రశంసఁ జేయఁదగువాఁడు కృతార్థతముండు' అను పద్యము (4-11) శ్రీనాథుని యతిథి గౌరవబుద్ధిని సూచించుచున్నదని తలంపనగును.

గీ. అతిథి కడుసల్పుఁడైన నత్యధికుఁడైన
నింటికే తేరఁ బ్రియమందు నెవ్వఁడేని
వాని గౌరవ మది గౌరవంబుగాని
కాదు గౌరవ మాకారగౌరవంబు. (కాశీ)

అను కాశీఖండపద్య మమూలకమని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు శృంగారశ్రీనాథమునఁ దెలిపియున్నారు కావున నీనైషధపద్య మట్టి యభిప్రాయమును ద్యోతకము చేయుననుటలోఁ వైరుధ్య మగపడదు. శ్రీనాథునకుఁ గల భోజనప్రీతిని భీమఖండ కాశీఖండములలోని యమూలకము లగు నతనిపద్యగద్యములు స్పష్టపఱచుచున్నవి. (భీమ. 2-139, 141. కాశీ. 7-186) ఇవి శృంగారశ్రీనాథమున నుదాహరింపఁబడియున్నవి. నైషధమునందును నమూలకము లగు భోజనపదార్థ వర్ణనములు గలవు. 6-120, 123, 124, 125, 139, పద్యము లమూలకములు.

శ్రీనాథునకు దేశిసంగీతముపైఁ బ్రీతికలదనుటకు "వీనులవిందుగఁ బాడి రంగసల్, దేశివిధంబుమార్గమునఁ దేటయు నొక్కట సాళగింపఁ గన్ (7-146) అను నైషధపద్యభాగమువల్లఁ దెల్లమగుచున్నది. 'దేశికగానమార్గములఁ దిన్ననిరీతులఁ బాడి పాడి' (హర. 3-62) అను హరవిలాసపద్యపాదము దీనిని బలపఱచుచున్నది. 'గీతాంతరేషు శ్రమవారి లేశైః' (కుమార 3-38) అనిమాత్రమే హరవిలాసపద్యపాదము

నకు మూలము కలదు. "ఆస్థానంబునఁ రాజనందనయుం దానును దేశిమార్గమున గంధర్వాప్సరోనృత్తముల్" (కాశీ. 3-19) వంటి కాశీఖండప్రయోగములుగూడ నమూలకములు కానచ్చును.

(కాశీ. 6-169)

"చిత్తములోనఁ బాయక వసించిన నిర్మలతత్త్వ విద్యన
త్యుత్తమశిష్యుఁ గూర్చి గురు లూఱటఁ బొందినయట్టిలాగునఁ

(7-36)

'ఆగమజ్ఞాననిధివి తత్త్వార్థఖనివి' (హార. 12)

అను హారవిలాసపద్యపాదము శ్రీనాథుఁడు తత్త్వార్థఖని యనుటకు నిదర్శనము. కావున నీనైషధపద్యపాదములు శ్రీనాథుని తత్త్వవిద్యాప్రదానమునకు సంబంధించినవే యని తోఁచుచున్నది.

IX అనుస్మృతులు :—

వ. అంభోరుహాక్షులు తన్ను వీక్షించుచు సంజాతకౌతుకంబున వింజమాకిడినభంగి నూరకుండ నప్పుణ్యశ్లోకుండు ప్రావృషేణ్యపయోధరధ్వానగంభీరంబైనయెలుంగున (4-16) నలుని రాయబారఘట్టమునందలి యీయమూలకవచనము శ్రీకృష్ణుని రాయబార సందర్భమునందలి యీపద్యముల కనుస్మృతిగాఁ గన్పట్టుచున్నది.

క. ఆకొలువువారు కర మచ
లాకృతి నొకపలుకులేక యందఱు వింజం
బాకిడిన కరణి ననశము
దాకారితచిత్తవృత్తులై యుండంగన్ (ఉద్యో. 3-255)

క. జలదస్వనగంభీరత
నెలుఁ గొప్పఁగ దంతదీప్తు లెసఁగ ముకుందుం
డలరు చెవుల నఖిలజనం
బులు విన ధృతరాష్ట్రభూవిభున కిట్లనియెన్.

వ్యామగ్రాహ్యపదము (8–98) మురారి యనర్ఘరాఘవము నుండియుఁ 'బుటపాకప్రతీకాశంబై' యనునది భవభూతి 'ఉత్తరరామ చరిత్ర'నుండియు గ్రహింపఁబడుట స్పష్టము.

ప్రబంధకలవులందఱు శ్రీనాథుని పద్యపాదముల ననుసరించిన వారే. ప్రబంధశయ్యకు మార్గదర్శకుఁడు శ్రీనాథుఁడే యనుటకు సందియములేదు. పిల్లలమఱ్ఱి పినవీరనాదు లాంధ్రీకరణవిషయమున శ్రీనాథునిపద్ధతినే యవలంబించియున్నారు. శ్రీనాథుని పద్యపాదముల నెట్లు పెద్దనాదు లనుసరించిరో వసుచరిత్రవిమర్శనమున విపులముగా నుదాహరింపఁబడియున్నది. అట్టి యనుసృతులు మఱికొన్ని కూడఁగలవు. కాని విస్తరభీతిని విరమించుచున్నాఁడను. ఈ సందర్భమున నాంధ్రనైషధవ్యాఖ్యాతృముద్రణసంస్కారముగూర్చి కొంచెము వ్రాయ వలసియున్నది.

X సర్వంకషవ్యాఖ్యాతృముద్రణసంస్కార పరామర్శము:—

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు మహాకవి సమ్మతములని కరతలామలకముగ నెఱుఁగనగువానినిసైతము సవరించుట సాహస మనక తీరదు. ప్రోషిమ, బచ్చుకు, నిషధరాజంతవాని మొదలగువానిని దీని కుదాహరింపవచ్చును. పాఠనిర్ణయాదులనుగూర్చి దిఙ్మాత్రముగా నిటఁ బరామర్శించుచున్నాఁడను.

"వంచనలేక యానవము వంచినయప్పుడు ఫాల మోరగావించుఁడు......(7–183) 'బాలమోరగా' నని పూర్వముద్రణమున నుండఁగా 'ఫాలమోరగా' నని తమసవరణముగాఁ జూపినారు. 'ఫాల కోరగా' నని నెల్లూరుజిల్లా తాళపత్త్రపుస్తకమునఁ గలదని యొసఁగిరి. ఇదియే 'ఫాలమోరగా' నని దిద్దుటకు హేతువుకానోవును. పూర్వ ముద్రణముననే కాక పిఠాపురసంస్థానపుఁ దాళపత్త్రపుస్తకమునందుఁ

గూడ 'బాలమోరగా' నని కలదని పాఠభేదపత్రికరణముననే చూపి యున్నారు. బాలమోరగాననునది లేఖకదోషమనియు,'భాలమోరగా' ననునది కవిప్రయుక్త పాఠమనియుఁ జెప్పుట సముచితము. కాశీఖండ ముద్రణసంస్కారమను మదీయవ్యాసముపై (మార్గశీర్ష పుష్యమాస ముల సంచిక) నభిప్రాయమొసగుచు శ్రీ వఝలవారిట్లు వ్రాసినారు. "ఫాల" అను వర్గద్వితీయశబ్దమే లేదు. వర్గచతుర్థాదిశబ్దమే సాధువు. చూడుఁడు సంస్కృతకోశములు. సంస్కృతకోశములందు 'ఫాల' శబ్దమునకు 'లలాటము' అనునర్థము లేదు గాని 'ఫాలాక్షశివ' శబ్దము సర్వశబ్దసంబోధినిలో నగపడుచున్నది..." భాలశబ్దము శ్రీనాథ సమ్మతమనుట కావ్యాసమున యుక్తులు ప్రదర్శించియున్నాఁడను. ఫాలశబ్దము ప్రాసాదినిబద్ధస్థలములందుఁ గన్పట్టినట్లు లేదు. కాని ఫాలనయనశబ్దముమాత్రము ముక్తపదగ్రస్తమునఁ గలదు. "ఫీలవము గ్వాలివిఫాలఫాలనయనాలంఘ్యాంబకోత్తాల (హ. న.) ఇట్లే 'బాల కర్ణద్వయీ' అను పాఠము వ ఫ బ ప్రతులలోను, 'చాలకర్ణ' యని క ఖ గ డ థ ప్రతులలోను నుండఁగాఁ గళాపూర్ణోదయపరిష్కర్త గారు (శ్రీమల్లాదివారు) 'చాలకర్ణద్వయీ' యనియే ముద్రింపించి యథోభాగమునఁ దాళపత్త్రములలోని ద్వివిధరూపములను నొసంగి "ఫాలకర్ణద్వయీ' సముచితమగును" అని వ్రాసినారు. 'చాలకర్ణ' యనుచో 'చ' వర్ణము లేఖకదోషమనియు 'బాలకర్ణ' యనుచో వ్రాఁతలో నొత్తుతొలఁగినదనియుఁ 'భాలకార్ణద్వయీ' కవి ప్రయుక్త పాఠమనియు నిర్ణయించుట యుక్తము కాదా? "శబ్దరత్నాకరమున ఫాలశబ్దమే యుండుట భాలశబ్దమే లేకుండుట యవిమర్శకృతము" (శ్రీవఝల) శ. ర. లో లేకుండుటయే యీపరిష్కర్తలతడబాటునకు మూలము కావచ్చును.

'హరిహయునిక్ వరించెదవొ హవ్యవహుం జరణంబుత్రొక్కెదో'

'చరణంబు త్రొక్కెదో' యనియే కొండపల్లి వీరవేంకయ్య గారి ముద్రితపాఠము. కూచిమంచి తిమ్మకవి సరసపదికొసఁగిన యుదాహరణములో నీపాఠముతోడనే యిచ్చినాఁడు. 'కలికి నిను రాజ హంసంబు కాలుద్రొక్కె' (విజయ) 'అంబుధీశుని చరణంబుద్రొక్కె' (అడిదము సూరకవిచాటువు.) మొదలగు ప్రయోగములు గలవు. 'వరణంబొనర్చెదో' యనునది సరసము కాదు.

వలరాజు వెల్లెల్లి (8-201) యనుచో వెల్లల్లి పాఠము సరికాదని శ్రీ గిడుగు రామమూర్తిగారు చర్చించి రెండు మూఁడు సంస్కృతకవి ప్రయోగములు భాషాభేషజములో నొసఁగినారు. శ్రీనాథుని ప్రయోగములే యీవిషయమునకుఁ బ్రబలాధారములుగా నున్నవి.

'అతను జగజంపుగోడు గెవ్వఁ డవ్విధుండు (కాశీ. 4-195)

'అసమశరసార్వభౌము ముత్యాలగోడుగు
విధుఁడు......' (భీమ. 2-42)

"పామునకు బలియీయని ప్రతినవారు
నీఁగ కెన్నఁడు నేనిలియిడనివారు. (7-53)

"ఈఁ......గాటిని యిచ్చువారు"- పూ. ము. పిఠా. తాళ.

"ఇంక్క కెన్నడు గాదను యిచ్చువారు"- నెల్లూ. తాళ.

తాళపత్త్రిమాతృకలలో నిట్లుండఁగా శ్రీ వేదమువారు 'ఈఁగ కెన్నడు నేనిలియిడనివారు' అని ముద్రింపించినారు.

"ఈఁగకిలి పామునకుబలి' అని కుచేలోపాఖ్యానము దానము లేదనుటకు 'వారియింట ఇలీ బలీ పుట్టదు' అని లోకవాదము" ఈ వేదమువారి వ్రాఁతకు బ్రౌణ్యమేకారణ్యమని తోఁచుచున్నది. "ఇవి N. S. Food. Kuchelop 3-115. ఈగెకు యిలి పాముకు బలి పుట్టదు. వానియింట్లో యిలిభిక్షము బలిభిక్షము పుట్టదు. In the miser's house a fly cannot find a dinner"-Brown.

వేదమువారి సవరణము తాళపత్రిమాతృకా విరుద్ధమనుట స్పష్టము. "ఈఁగ కెన్నఁడుఁగాటు నేనిడనివారు" అనురీతిని సవరించుట యుక్తము. దీని కీ క్రింది పాండురంగమాహాత్మ్య ప్రయోగము ప్రబల ప్రమాణ మగుచున్నది.

"ముంచి యీఁగకుఁ గాటు, పాముసకు బలియు
నొసఁగఁడని భర్తృకై పొక్కు నవిద మదిని" (పాండు 4-149)

"సంతసంబయ్యె సురరాజ సాధుసాధు" (3-16) ఇట 'సాదు సాదు' అని ముద్రితము. "సాధుసాధు మహాబుద్ధిబోధమహిత" (కాశీ. 3-143) అను ప్రయోగము ధవర్ణస్థితికి స్థాపకమగునా? యని యాలోచింపవలసియున్నది.

"నముచిదమనుండు పుత్తెంచినాఁడు నీకు" (3-120) ననుచో నఖండయతి యగునని తలంచి శ్రీ వేదమువారు 'నాతినీకు'నని దిద్దివేసి వ్యాఖ్యలో వివరించినారు. "అఖండయతి శ్రీనాథసమ్మత మనుటయే లెస్స" (శ్రీ వఝ్ఝలవారి లేఖ.) కాశీ. 4-121, 6-141, 5-304, 7-200. (నూ. ము.) 1-63 నూ. ము. లో 2-50, 3-160, 6-270 పద్యములలో నున్నయఖండయతులు పూర్వముద్రిణమున సవరింపఁబడియున్నవి. భీమఖండమున 1-12, 1-80, 3-62, 3-179, 3-189, 3-221, 4-163, 5-25. 5-184, 6-10 పద్యములలో నఖండయతులు గన్పట్టెడి.

'నముచిదమనుండు పుత్తెంచినాఁడు నీకు' వంటి వఖండయతులుగాఁ దలంచుచో నీక్రిందివికూడ నట్టివే.

'ననుమీఱ మన్నించినాఁడు మేలె' (కాశీ. 4-148)

'నాఁడుమొదలుగ నిపుడు కన్నారమందు' (కాశీ. 5-9)

ఉత్తర హరివంశకారుఁడును నిట్టివి వాడినాడు.

"నన్నుఁ గఱలించి బ్రిదుకుఁగన్నారు లేకు" (ఉ. హ. 4-60)

'నా, నామునిబాధలం గమరినాడవు కాలినతాఁటి చందనై'

(ఉ. హ. 4-286)

'శంభుసర్వజ్ఞుఁడగుట లాక్షణికవృత్తి' (8-140) శంభుశబ్దము రాహిత్యాదులలోఁ జేర్చుకొనవలయునని వేదమువారు వ్రాసినారు. కాని 'శంభుసర్వజ్ఞుఁడనుట లాక్షణికవృత్తి' యని కవిప్రయుక్తపాఠముగా గ్రహించు టుచితము.

ఉద్దండపండిత కవీంద్రులగు హర్ష శ్రీనాథుల నైషధములను దారతమ్యనిరూపణపద్ధతిఁ బరిశీలించుటయు విమర్శనము వ్రాయుటయు నావంటి యల్పునకు సాధ్యము కాదని యెఱింగియు నాంధ్రభాషారాధన తత్పరత్వమున శక్యాశక్యవిచారము చేయక నాయెఱిఁగినకొలంది పరిశీలించి వీలైనంత సంక్షేపముగా నిట విమర్శించినాఁడను. ఈరచనమునకుఁ బ్రోత్సహించి కారణభూతులైన శ్రీ చతుర్వేదుల సత్యనారాయణ గారికి కృతజ్ఞతాపూర్వకవందనముల నర్పించుచున్నాఁడను. నా యీ వ్యాసమున గుణలేశము లేవేనున్న సహృదయులు గ్రహింతురుగాక!



గతసంచికానుబంధము

# ప్రాచీనాంధ్ర చారిత్రకభూగోళము-నాడులు

శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

## వెలనాడు—ఆఱువేలు

ఇతరనాడులవలెనే, వెలనాడుసహితము ఆఱువేల గ్రామపరిమితి గలప్రదేశమని శాసనములలో వర్ణింపఁబడినది. "స్వస్తిశ్రీ సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధనమహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబులు 41-శకవర్షంబుల 983 నేంటి ప్లవ సంవత్సరంబున చేఱేటి దక్షిణంబున యాఱువేల వెలనంటి.....అగ్రహారంబు పలివేరి త్రైపురుషస్థానమున" అని యొక శాసనమునను, మఱియొక శాసనములో, త్రిశత్తోర షట్సహస్రావని యనియు వెలనాడు గ్రామసంఖ్యాలపరిమితి వివరింపఁబడినది. (7)

ఈ వెలనాడు మొదట ఆఱువేల గ్రామములు గలిగి తర్వాత ఆఱువేల మూడువందలకు వృద్ధియైనటులఁ దెలియుచున్నది.

వెలనాడు చోడమండలములోని యొక యంతర్భాగమని పైనుదాహరించిన శాసనములోఁ గలదు. చోడచాళుక్యులాంధ్రదేశము నాక్రమించుకొనినప్పుడు వారాంధ్రభాగములోని నాడుల చోడమండలములో నంతర్భాగములుగ పరిగణించిరి.

---

(7) (1) దక్షిణహిందూదేశ శాసనసంపుటము 10. సంఖ్య 8.
(తెనాలి తాలూకాలోని పలివేరు శాసనము)

(2) దక్షిణహిందూదేశ శాసనసంపుటము 4. సంఖ్య 1138.
వెలనాటి గొంకయ ద్రాక్షారామ శాసనము (శా. శ. 1055)

## షట్సహస్రదేశము—ఆఱువేలనాడు

తాము షట్సహస్రావనీ నాథులమని చెప్పుకొన్నవారిలో అమరావతి నేలిన కోటమండలేశ్వరు లొకరు. వెలనాటిప్రభువుల విధమునసే వీరును తమ మూలపురుషుఁడు షట్సహస్రదేశమును త్రినయనపల్లవుని యనుగ్రహమున సంపాదించెనని తమశాసనములందు వ్రాసికొనిరి. (8)

"స్వస్తిశ్రీ చతుస్సముద్రముద్రిత నిఖిలవసుంధరాపరిపాలక, శ్రీమత్త్రినయనపల్లవ ప్రసాదిత కృష్ణవేణీనదీ దక్షిణషట్సహస్రావనీ వల్లభ, శ్రీధాన్యవటీ పురవరాధీశ్వర" అని వర్ణింపఁబడిరి. (9)

పై విధమునసే పరిచ్ఛేద రాజులును తాము కృష్ణవేణ్యానదీ దక్షిణ షట్సహస్రగ్రామావనీవల్లభులమని చెప్పుకొనిరి. (10)

(1) "విరజాపురీపురవరేశ్వర దుర్జయకుల కులాచలమృగేంద్ర సత్యహరిశ్చంద్ర, కృష్ణవేణ్యానదీదక్షిణ షట్సహస్ర గ్రామావనీ వల్లభ, వీరమహేశ్వర కొల్లిపాకపురవరేశ్వర."

(2) కృష్ణవేణ్ణా దక్షిణ తీరషట్సహస్ర......

అట్లె కొండపడుమటి మాండలీకులును దాము షట్సహస్రావనీనాథులమని చెప్పుకొనిరి. (11)

---

(8) ఎనమదలశాసనము ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము 3. పుట 95.

(9) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 4 సంఖ్య 976

" " 10 " 198

(10) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 10 సంఖ్యలు 269, 222.

(11) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 6 సంఖ్య 103 (శా. శ. 1067) బుద్ధవర్మ వంశము వారైన పండమ షట్సహస్రావని నేలెనని కలదు.

## రాజధాని – ధరణికోట

పట్నహాసి దేశమునకు ముఖ్యపట్టణము ధరణికోట. దీనికే ధాన్యకటకమనియు, ధాన్యాంకపురమనియు నామాంతరములు. దీనికే అమరావతీ ప్రాకృత శాసనములలో ధణ్ణకడ, ధణ్ణకట, ధణ్ణకటకమనియుఁ బేర్లు గలవు. (12)

ఈ వెలనాడు పై శాసన ప్రమాణముల ననుసరించి, గుంటూరు మండలములోని కమ్మనాటి కుత్తరమునను, కృష్ణానదీ దక్షిణతీరమున (దివి తాలూకా కలుపుకొని ఇదియె శాసనములలో ద్వీపముగా పేర్కొనఁబడినది) గుంటూరు, రేపల్లె తాలూకాలును, సత్తెనపల్లి తాలూకాలో పల్నాటికి తూర్పుభాగమును, బాపట్ల తాలూకాలో నుత్తరభాగము తూర్పున సముద్రముగలభూమి నావరించియుండెనని యూహింపనగును.

## కన్నడశాసనములు–వెంగినాడు

చోళ చాళుక్య ప్రభుత్వ మాంధ్రదేశములో నంతరించిన తర్వాత కొన్నివత్సరములు పశ్చిమచాళుక్య ప్రభువైన త్రిభువనమల్ల దేవుఁ డాంధ్రవేంగీ మండలమును జయించి పాలించిన ట్లతని శాసనములవలనఁ దెలియుచున్నది.

తెనాలి తాలూకా కొమ్మూరు గ్రామములో త్రిభువనమల్ల చాళుక్య విక్రమాదిత్యుని ప్రచండ దండనాయకుడైన అనంతపాలయ వ్రాయించిన కన్నడ శాసనములో పశ్చిమ చాళుక్యరాజు వేంగి పది నాల్కుసాసిరము (వేంగిపదునాల్గువేలు) నేలు చుండెనని తెలియుచున్నది. అనంతపాలుని మేనల్లుడైన గోవిందరాజు కర్నూలు జిల్లాలోని త్రిపురాంతకములో వ్రాయించిన మఱియొక కన్నడశాస

(12) Luder's list Nos. 1205, 1225, 1271 etc., Epigraphia Indica Vol. X.

నములలో ఆవిక్రమాదిత్య చక్రవర్తియే 'బేంగిపన్నిర్చాసిరము, ఎమ్మె దిలె యెలుసాసిరము' నేలు చుండెనని వక్కాణింపఁబడినది. ఈశాస నములఁ బట్టి వేంగిరాజ్యము పశ్చిమ చాళుక్యప్రభువుల వశమయ్యెనని తెలియనగును. ఇతని శాసనములు ద్రాక్షారామ భీమేశ్వరా లయములోఁ గూడ నున్నవి. (13) బేంగి పన్నిర్చాసిరమనగా వేంగి పండ్రెండు వేలని యర్థము. వేంగిమండలము కృష్ణకు దక్షిణమున గుంటూరు, కర్నూలు, నెల్లూరు మండలముల వఱకు వ్యాపించియుండె నని యూహింపవచ్చును. అందుకనే వేంగి వేయి, వేంగి పండ్రెండు లేక పదునాల్గు వేలు గానోపును.

## వేంగివిషయము—వెంగోరాష్ట్రము

వెంగోరాష్ట్రము (వెంగనాడు) పల్లవప్రభువైన రెండవ సింహ వర్మ మాంగడూరు శాసనములో పేర్కొనఁబడినది. ఈశాసనము విజయదశనపురమునుండి యొసఁగఁబడినది. ఈదశనపురమె, నెల్లూరి మండలములోని 'దర్శి' గ్రామముగా శాసనపరిశోధక శేఖరులైన శ్రీ వెంకయ్యగారు నిర్ణయించి యున్నారు. (14) పల్లవులు పాలించిన ఈ వెంగోరాష్ట్రము వేఱు, వేంగిరాష్ట్రము వేఱు. వెంగోరాష్ట్రమె వెంగనాడుగ నెల్లూరిమండలములో సూళూరుపేటలోని తురంగేశ్వర స్వామి యాలయములో వ్రాయఁబడిన తమిళశాసనములో పైయూ

---

(13) (1) తెనాలితాలూకా కొమ్మూరు శాసనము (కన్నడము) కర్నూలు తాలూకా త్రిపురాంతకశాసనము (కన్నడము) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము- 9

ప్రథమ సంపుటము. సంఖ్య 196. (క్రీ. శ. 1118)

" " 213. (క్రీ. శ. 1126)

(2) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము. 4. సంఖ్యలు 1212, 1213, 1229 (క్రీ. శ. 1121-1125)

(14) Indian Antiquary Vol. V. Page 154.

రిళం కొట్టములోని వెంగనాంటిలోని సురబూరనియెడి సింగలంతపురమని సూళూరుపేట పేర్కొనఁబడుటవల్ల, వెంగోరాష్ట్రము వేఱు, వేంగిరాష్ట్రము వేఱని స్పష్టము. అరవ సారస్వతములో తిరుపతి కొండకు వెంగడమనియు, వేంకటేశ్వరస్వామికి తిరువెంగడనాథుఁడనియుఁ బేర్లుకలవు. నెల్లూరిమండలములో నుదయగిరిశాసనములో శ్రీ వెంకటేశ్వరుడు వెంగడనాథుడని పేర్కొనబడినాడు. (15)

ఈ వెంగడ మనుసరించియే, తత్పరిసరప్రాంతములకు వెంగోరాష్ట్రమను పేరు వచ్చియుండును. ఈ వెంగోరాష్ట్రము, దక్షిణ నెల్లూరిమండలము, చెంగల్పట్టు, ఉత్తరార్కాటు జిల్లాలు, ఉత్తరమున తిరుపతివఱకును వ్యాపించి తొండమండలములో నంతర్భాగముగ నుండెనని యూహింపవచ్చును. (16) ఇప్పటికి ఇది నాయూహ. భావిపరిశోధనవల్ల నిర్ధారణ సేయవలసి యున్నది.

## పా నా ర వి ష య ము

ఆంధ్రదేశములో ప్రాచీనమును, ప్రసిద్ధమునైన విషయములలో పానార మొకటి. ఇయ్యది వేంగినాటిలో వసిష్ఠగోదావరి నంటుకొని, పశ్చిమగోదావరిమండలమునందలి తణుకు, భీమవరము, నరసాపురము తాలూకాల నావరించి యుండెను. ఏడవ శతాబ్ద ప్రారంభమునాటి పృథ్వీమహారాజు తాండివాడ శాసనములో పాగునారవిషయము పేర్కొనబడినది. మహారాజ రణదుర్జయుని కుమారుడగు విక్రమేంద్రుని పుత్త్రుడనగు పృథ్వీమహారాజు పిష్టపురము (పిఠా

(15) వెంగనాండు (Sulurpet–(4) Nellore Inscriptions ; వెంగడనాథనొడుపడి-(Udayagiri (6)

ఈ సూళూరు మరియొక శాసనములో వేలూరునాటిలోనిదని తెలుపబడినది (Sulurpet– (7)

(16) శ్రీ కృష్ణస్వామి అయ్యంగారు రచించిన తిరుపతిచరిత్ర. పుటలు 1.29 (History of Tirupathi pages 1–29.)

పురము) నుండి కొండమంచి గ్రామనివాసియు, కామకాయనసగోత్రుడును, విష్ణుశర్మ పుత్త్రుడును, పృథ్వీశర్మయొక్క కుమారుడు నగు భవశర్మకు పాగుణార విషయములోని తాణ్డివాడగ్రామమును అగ్రహారముగా సర్వబాధాపరిహార మొనర్చి యిచ్చెను.

"శ్రీ పృథివీ మహారాజః పాగుణార విషయే తాణ్డివాడ గ్రామ మధి వసత స్సర్వ్వ సమవేతా౯ కుటింబినః సమాజ్ఞాపయతి" పై శాసనము భారతి పత్రికలో యువ సంవత్సర భాద్రపద మాససంచిక యందు ప్రకటించబడినది. ఇదియె పానార విషయమును గూర్చి తెలుపు ప్రథమ శాసనము. చాళుక్య ప్రథమ విజయాదిత్యుని యొక శాసనములో నియ్యది ప్రాకునారవిషయమని వక్కాణింప బడినది. దీనిలో విజయాదిత్యుడు ప్రాకునార విషయములోని వర్జిపఱ్ఱు గ్రామ వాస్తవ్యుడును, భారద్వాజగోత్రుడును, మాధవ నామధేయుడునగు నొకవిప్రునకు అగ్రామములోని కొంతభూమిని దానము చేసెను. (17)

ఈ క్రింది మరికొన్ని శాసనములలో నీ పానారవిషయము పేర్కొనబడినది-

(1) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 4. సంఖ్య 1298.
పావనవారమున తనుకున కొమ్మనపెగ్గడ.

(2) దక్షిణ హిందూదేశశాసనసంపుటము 5. సంఖ్య 75.
పావునవారములోని మెటగుములవారి మాడియనాయకు కొడుకు గొణ్డియపెగ్గడ.

---

(17) "విజయాదిత్యుని రెండుతామ్రశాసనములు" ఆంధ్ర చారిత్రక పరిశోధక మండలి వారి పత్రిక-సంపుటము 5. పుట. 56. ఈ విజయాదిత్యుడు క్రీ. శ. 751-769 వేంగీ రాజ్యమేలిన పూర్వ చాళుక్య ప్రభువు.

(3) దక్షిణహిందూదేశ శాసన సంపుటము 5. సంఖ్య 124.
(శా. శ. 1228.)
పావరాన విప్పఱుతను.

(4) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 6. సంఖ్య 148.
(శా. శ. 1076.)
పానవారములోని అగ్రహారమైన కొండేటి.
"పానావార విశేషధాత్రివిషయే కొండేటి వాస్తవ్యకః."

(5) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 10. సంఖ్య 146.
(శా. శ. 1082.)
"శాకాబ్దె నయనేభ ఖేండుగణితే గూఢస్తనీతీరగే తస్మిన్
పావనవార దేశలలితే శ్రీ డుత్తికాఖ్యేపురే."

(6) దక్షిణ హిందూదేశ శాసనసంపుటము 10. సంఖ్య 147.
(శా. శ. 1082.)
"శాకాబ్దె భుజదంతి ఖేండుగణితే శ్రీ పోతనాఖ్యః ప్రభుః ప్రాదా
త్పావినవార విషయే గోధస్తనీ తీరగే గ్రామే డుత్తికనామ్ని."

(7) ముమ్మిడినాయకుని శ్రీరంగము శాసనమునను, కోరుకొండ శాసనమునను, పానారవిషయము పేర్కొనబడిన సంగతి యిదివఱకె సూచించియున్నాను. శ్రీరంగము శాసనములో వసిష్ఠ గోదావరి పశ్చిమతీరముననున్న పానారవిషయములోని కొట్టల్లపల్లి గ్రామము దానముచేయబడినట్లు వ్రాయబడినది. ఆ గ్రామసీమలలో నీదిగువగ్రామము లుదాహరింపబడినవి.

మోసంబల్లు, దేవ, నంగిపూడి, చేఱుకువాడ, విల్లూరు, తామరవాటక, పెనుంకొండ, మారెడేఱు.

(ముమ్మిడినాయకుని శ్రీరంగముశాసనము ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము XIV పుట 83–96.)

(8) రెండవఅమ్మరాజు వండ్రము శాసనము.

"యస్య భవద్విషయే (పావ్రనవార) ప్రాందోఱ్ఱు బేటిపూండి నామ సహాటకభాగ మగ్రహారీకృత్యసర్వ కరపరిహారేణ దత్త ఇతి విదితమస్తు."

ఈశాసనములోనే కొండేఱుగ్రామము సహితము పేర్కొనబడెను.

(ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము IX పుట 131-135.)

(9) అనవోతురెడ్డి కొమ్ముచిక్కాలవలస శాసనము—చిక్కాలగ్రామము (ఆంధ్ర చారిత్రక పరిశోధకమండలివారి పత్రిక సంపుటము 3. పుట 229.)

పై గ్రామములు నేటినామములతో నీక్రింది తాలూకాలలో గలవు.

| | | | | |
|---|---|---|---|---|
| మోనంబఱ్ఱు | — | మునమఱ్ఱు | — | తణుకుతాలూకా |
| నంగిపూండి | — | నెగ్గిపూడి | — | ,, |
| చెఱుకువాడ | — | చెఱుకువాడ | — | ,, |
| తనుకు | — | తణుకు | — | ,, |
| కొట్టలపఱ్ఱు | — | కోతాలపఱ్ఱు | — | ,, |
| తాండివాడ | — | తాడిపఱ్ఱు | — | ,, |
| కొండేఱు | — | కోడేరు | — | నరసాపురము తాలూకా |
| దుత్తిక | — | జుత్తిక | — | తణుకుతాలూకా |
| విప్పఱుత | — | విప్పఱ్ఱు | — | ,, |
| విల్లూరు | — | విల్లూరు | — | నరసాపురము తాలూకా |
| దేవ | — | దేవ | — | ,, |
| బేటిపూండి | — | బేతపూడి | — | భీమవరము తాలూకా |
| ప్రాందోఱు | — | పాందువ్వ | — | భీమవరము తాలూకా |

| | | | | |
|---|---|---|---|---|
| వెట్టగుములూరు | — | గుములూరు | — | నరసాపురము తాలూకా |
| పెనుకొండ | — | పెనుగొండ | — | తణుకు తాలూకా |
| తామరవాడ | — | తామరాడ | — | ,, |
| మారెడేఱు | — | మారుచేరు | — | ,, |
| చిక్కాల | — | కొమ్ముచిక్కాల | — | నరసాపురము తాలూకా |

ఒకటి, రెండు గ్రామములు రెండు మూడు తాలూకాలలో నున్నవి. అయినను విషయనిర్ణయమునకు బాధింప నేరవు. పానారవిషయమనునది వేంగిమండలములో ఉభయ గుద్రాహారవిషయములకు మధ్య నుండెననియు నిప్పటి తణుకు, భీమవరము తాలూకాలును నరసాపురము తాలూకాలో గొంతభాగమును గలసి యుండెనని భావింప వచ్చును.

## గోస్తనీనది-గోస్తనది

పానవారవిషయములో గోస్తనీనదికలదని జుత్తిక శాసనములు పేర్కొనుచున్నవి. ఈనదికి శాసనములలో గూడస్తనీయనియు, గోధస్తనీయనియు బేర్లు గలవు. ఇది యిప్పుడు తణుకు భీమవరము తాలూకాలలో నొక కాలువగా పడుమటి గోదావరి డెల్టాలో మార్పును జెందియున్నది. దీనికి గోస్తనది యనిపేరు. ఈనది వాయు పురాణములో పేర్కొనబడినట్లు వినియుంటిని గాని, దానివివరములు ఆంధ్రప్రదేశములలోని నదులను గూర్చి వ్రాయునపుడు ప్రత్యేకముగా తెలుపబడును.

## పొత్తపినాడు

పొత్తపి యనుగ్రామము కడపమండలములో రాజంపేట తాలూకాలో చెయ్యేరు నదీతీరమున నున్నది. ఆగ్రామ నామమును బట్టియే యీనాడునకా పేరువచ్చెను. కొణిదెన చోడులలో పూర్వుడైన దశవర్మ యనునతడు పాకనాటిని జయించి, పొత్తపి పట్టణమును

రాజధానిగా నొనర్చి పరిపాలించెనని, నరసారావుపేట తాలూకా బొప్పూడిశాసనములో వర్ణింపబడినది. కరికాలచోడునకు మహిమాను డను కుమారుడు గలడు. అతనికి ముగ్గురుకుమారులు గల్గిరి. వారు కరికాలుడు, తొండమానుడు, దశవర్మ యనువారలు. కడపటి వాడైన దశవర్మ కొణిదెన చోడులకు పూర్వపురుషుడై పాకనాటినిజయించిన వాడు. (18)

"తేషాం త్రయాణాం దశవర్మ ధాత్రీపతిః స్వశౌర్యాదథ పాకరాష్ట్రం
ఆక్రామ్య వీరప్రవరో రరక్ష క్షమామిమాం పొత్తపి రాజధాన్యాం"

పైన జెప్పబడిన కరికాలుని వంశమున తెలుంగు బిజ్జన జనించె ననియు, నాతని మనుమడు మల్లిదేవుడు పొత్తపి రాజధానిగా పాక నాటిని బాలించుచుండెననియు, కొణిదెన శాసనమునందు గలదు. (19) కొణిదెన నరసారావుపేట తాలూకాలో నున్నది. కమ్మనాటికి రాజ ధానిగ నుండెను.

కం. అట్టికరికాల నృపతికిఁ
బుట్టెను మహిమానచోడుడు భువినాతనికిం
బుట్టిరి గరికాలుఁడు సిరి
కట్టనునుంగులు దొండమాన ఘనదశవర్మల్.

కం. అకరికాల నరేంద్ర
ప్రాకట వంశమునఁబుట్టె భాసర్కాదులర
త్నాకర చంద్రుడు రిపునృప
భీకరుఁ డధికుండు చోడ బిజ్జన బిరుదై.

చ. బిరుదన జన్నయా తెలుగు బిజ్జనమన్మడు మల్లిదేవుడ
చ్చెరువగు చున్న పొత్తపిడు చెన్నగు పీడుగ వాలిపాకనా

(18) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము. 6. సంఖ్యలు, 651.
(19) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 6. సంఖ్య, 628.

డిరువది యొక్క వేయి జననేలుచు బల్లహు దండుగెల్చి త
త్కరివర కుంభమౌక్తిక లతాతతి బూచె నిజాసిపుత్రిక౯.

కడవ మండలములోని అత్తిరాల గ్రామములోని తమిళశాసనములలో అధిరాజేంద్రమండలములో పేర్వాకనాడులో పొత్తపినాడొక యంతర్భాగమని తెలుపబడినది. నందలూరిలోని తెలుగు శాసనములో నొకదానియందు పొత్తపినాటిలో తాళపాక, లెంబాక, టంగుటూరు, ప్రోలి, ఒప్పిలియను గ్రామములా గ్రామపెద్దలు చొక్కనాథ పెరుమాళ్లకు ధారవోసి యిచ్చిరనియు గలదు. పైగ్రామము లన్నియు రాజంపేట తాలూకాలోనివై యున్నవి. ఆగ్రామములే గాక నందలూరు, అత్తిరాల, గుండ్లూరు, కుందులూరు అనుగ్రామములు పొత్తపినాటిలోనివని కడపమండలములోని యాగ్రామములందున్న తమిళ, ఆంధ్ర శాసనములవల్ల విదితమగుచున్నది. పైగ్రామములు రాజంపేట తాలూకాలోనివై యున్నవి. ప్రొద్దుటూరి తాలూకాలోని కొత్తపల్లియు పొత్తపినాడులోనిదని యాగ్రామమునందలి యొక తెలుగు శాసనమువల్ల దెలియుచున్నది.

నెల్లూరిలోని రంగనాయకస్వామి వారి దేవాలయములో నొక తమిళ శాసనములో జయంకొండచోడమండలములో పొత్తపినాడొక యంతర్భాగమని వ్రాయబడినది. ఆశాసనములో క్రిందినాడు లుదాహరింపబడినవి. పేడైనాడు, పేరాట్టినాడు, ముంగలారట్టినాడు, కడైసింగనాడు, పూంగైనాడు, తొంగైపూనూల్నాడు, చాకలనాడు, పొత్తపినాడు. విజయనగరసామ్రాజ్యాధీశుడైన తిరుమల దేవరాయల పెనుగులూరు శాసనములో సిద్ధవటసీమలో పొత్తపినాడున్నదని వ్రాయబడినది.

ధూర్జటిమహాకవి శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందు కన్నప్ప యను తిన్నని జన్మభూమి వర్ణనములో నతని జన్మభూమి పొత్తపినాటిలో వుడుమూరని వ్రాసియున్నాడు.

ఉ. పొత్తపినాటిలో విపినభూమిఁ గిరాతులకాటపట్టు లో
కోత్తర వన్యవస్తు వుడుమూరను పక్కణమొప్పుఁ దద్రమో
దాత్తమహత్త్వమద్భుత రసావహమూహ యొనర్ప మేదినీ
భృత్తట నిర్ఝరాంబురుహ బృంద సుగంధ సగంధవాహమై.

తృతీయాశ్వాసము. పద్యము, 3.

పైనుదాహరించిన వుడుమూరు గ్రామలో రాజంపేట తాలూకా టంగుటూరి గ్రామమునకు సమీపమున 'ఉడుములపాడ'ను గ్రామమని ఆగ్రంథమునందలి టీకలోనే వ్రాయబడినది.

అయ్యలరాజు నారాయణామాత్యుడు హంసవింశతి ప్రథమాశ్వాసము ఏబదిమూడవ పద్యములో నీదిగువ నాడుల పేర్కొని యున్నాడు.

కం. వెలనాడు వేగినాడును
బులుగులనా డ్పాకనాడు పొత్తపినాడుఁ
అల మురికినాడు రేనా
డలయుక గనుఁగొంటి నచటి యబలలఁగంటిఁ.

ఇంతవఱకు పైనాడులలో పులుగులనాడు తప్ప, మిగిలిన నాడులను గూర్చి వ్రాసియున్నాను. తిరుపతి దేవస్థానశాసనసంపుటములలో తాళ్లపాక, పరాండలూరు పొత్తపినాటి లోనివని తెలియుచున్నది. తాళ్లపాక, పొందలూరు (పెరండలూరు) గ్రామములు రాజంపేట తాలూకాలో గలవు.

విజయనగరసామ్రాజ్యములో నిది ఉదయగిరిరాజ్యములో సిద్ధవటసీమలో నంతర్భాగమని యానాటి శాసనములలో వ్రాయబడి యున్నది. పొత్తపినాడనునది యిప్పటి రాజంపేటతాలూకా ప్రొద్దుటూరుతాలూకా కొంతభాగము నైయుండెనని యూహింపవచ్చును.

దీనికితూర్పున పాకనాడు, ఉత్తరమున ముల్కినాడు, దక్షిణమున వెంగోనాడు, పడమట పేర్వాకనాడు కలవు. (20)

## వేఙాక పొత్తపినాడు

చరిత్రకెక్కినదియు, ప్రసిద్ధిని గాంచినట్టియు వేఙోళ పొత్తపినాడు శాసనబద్ధమై, మఱుగువబడియున్నది. ఈ రెండవ పొత్తపినాడు గోదావరి మండలములోని ప్రోలునాటిలో నంతర్భాగమైయుండెనని తోచుచున్నది. వీరచోడుని పిఠాపుర శాసనములో ప్రోలునాటిలోని, మాలపల్లి, పొన్నతోఱ్ఱు అనురెండుగ్రామములును, ఉత్తర వరుస విషయములోని 'అలమి' యనుగ్రామమును గలపి వీరచోడ చతుర్వేదిమంగలమని పేరుపెట్టి అయిదువందల ముప్పదియారు బ్రాహ్మణుల కగ్రహారముగ నిచ్చెనని కలదు. ఆగ్రామమునకు సీమల వివరించు పట్టున 'ఉత్తరవరస- మల్లప్రోలునుంబొన్నవాడయుం గూడిన చోట ఱాయును దీని ఉత్తరమున కొల్లిప్రోలును బొత్తపినాంటి చేబ్రోలును గూడినచోట తంగ్గడుల జెట్టునపుట్టయు...' నని గ్రామ సీమానిర్ణయము చేయబడినది. సంస్కృతభాగములో నిట్లున్నది- "షట్కర్మ నిరతేభ్యః న్యూనాధిక భావేన చతుశ్చత్వారింశ దధిక

---

(20) (1) అత్తిరాలశాసనములు. సంఖ్యలు, 647, 650, 652.

(2) గుండ్లూరు సంఖ్య 665
(3) కుండలూరు ,, 668
(4) కొత్తపల్లి ,, 687
(5) ఎమ్మెనూరు ,, 899
(6) నందలూరు ,, 797 799
(8) టంగుటూరు ,, 879
} మద్రాసు శాసనములు కడపజిల్లా.

(9) పరాండలూరు
(10) తాళ్లపాక
} తిరుపతి శాసనసంపుటములు, 3. సంఖ్యలు 31 ; 61.

(11) తిరుమలరాయని పెనుగులూరు శాసనము.

ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము XVI పుట 241.

పంచశత సంఖ్యాక భాగాక పరికల్ప్య భవద్విషయే ద్వాదశపూండి సహిత మాలవెల్లినామగ్రామః పొన్నతొఱ్ఱి నామగ్రామశ్చ ఉత్తరవరుస విషయే ఆలమి నామగ్రామ శ్చేతి గ్రామత్రయ మేకీకృత్య శ్రీవీరచోడ చతుర్వేదిమంగలనామ్నా సుప్రతిష్ఠాగ్రహారీకృత్య..."

పై శాసనములో వివరింపబడి, ఏకీకృత్యముగావింపబడిన గ్రామములు పిఠాపురముడివిజనులో మల్లవరము, పొన్నాడ, అమరవిల్లి యను నామములతో వెలయుచున్నవి. ఒకదానికొకటి చేర్చియే కలవు. చేబ్రోలుసహిత మానామముతోనే మల్లవరము సమీపముననే కలదు. ఈగ్రామములన్నియు ప్రోలునాటిలోని వని శాసనములో వ్రాయబడినది. ప్రోలునాటిని గూర్చి వ్రాయునపుడు వివరముగా తెలుపు చున్నాను. చేబ్రోలు పొత్తపినాటిలోనిదనియు, ఆలమి (అమరవిల్లి) ఉత్తరవరుసవిషయములోనిదనియు ప్రత్యేకముగా వివరింపబడినది. ఈపొత్తపినాడును, ఉత్తరవరుసవిషయమును ప్రోలునాటిలో నంత ర్భాగములని తోచుచున్నది.

## దానార్ణవుని కాండ్యముశాసనము-పొత్తపినాడు

రెండవ అమ్మరాజు పిమ్మట వేంగీరాజ్యమేలిన సతని సవతి సోదరుడగు దానార్ణవుని కాండ్యము శాసనములో నితడు మండికొండ చాళుక్యరాజ వంశోద్భవులును కుసుమాయుధుని కుమారులునగు మల్లన, గొండియ యనుసోదరులను పొత్తపినాటికి సామంత పరిపాలకు లుగా నియమించెనని వ్రాయబడినది. ఈదానార్ణవుడు క్రీ. శ. 970 సంవ త్సరములో పట్టాభిషిక్తుడయ్యెనని యీశాసనమునందె కలదు. ఆపట్టాభి షేక కాలముననె యీశాసనము వ్రాయించి యుండవచ్చును. ఈశాస నము విశాఖపట్టణముజిల్లాలోని శ్రీకాకుళమునకు ఇరువదిమైళ్లదూర మున నున్న కాండ్యము గ్రామములో దొరకినది. ఈశాసనములోని మనకుకావలసిన భాగములు ఉదాహరించుచున్నాను.

తాభ్యాం మల్లియరాజ గొండియరాజభ్యాం భవద్విషయే పొత్తపినాండు త్రిశతం శాసనీకృత్వా సర్వకరపరిహారం తతోఽకరపరి తుష్టైర స్మాభిర్దత్త మితివిదితమ్-

అస్యావధయః పూర్వతః పంపానదీ నదీ దక్షిణతః ఉత్తరవరుస పశ్చిమతః మీనుంబాకనాండు ఉత్తరతః నిడగునదెబ్బది.

శాసనసంపాదకులైన శ్రీ నరసింహముగారు ఈపొత్తపినాటిని కడపమండలములోని పొత్తపినాటిగా నిర్ణయించిరి. దానార్ణవుని సవతియన్నయగు అమ్మరాజవిజయాదిత్యుని కాలమునగాని, యితని కాలమునగాని వేంగీచాళుక్యరాజ్యము వెలనాడును దాటి విస్తరించి, పొత్తపినాడు సహితము కలిసి యుండెననుటకు చరిత్రాధారములు లేవు. అదియునుగాక దానార్ణవుడు తాను తనపరిపాలనమున నున్న రాష్ట్రములు లేక నాడులు గాక ఎక్కడనో యున్న పొత్తపినాటిని సోదరులకిరువురకు దత్తముగానిచ్చె ననుట సమంజసముగా కన్పట్టదు. నాయభిప్రాయము ఈసోదరద్వయమునకు తాను తనసవతియన్న తర్వాత రాజ్యమునకు వచ్చుటకై వారొనర్చిన సహాయమును గూర్చి కృతజ్ఞతను దెల్పుటకై, తనరాజ్యములో నంతర్భాగమైన పొత్తపినాడు నొసగియుండును. కాండ్యముశాసనములో చెప్పబడిన పంపానదియు, ఉత్తరవరుసయు, గోదావరిమండలములోనే గలవు. వీరచోడుని పిఠాపురశాసనములో పొత్తపినాడు, ఉత్తరవరుసలు నుదాహరింపబడినట్లు పైనివ్రాసి యున్నాను. పంపానదియు, ప్రోలునాటిలోనే కలదు. ఈపంపానది గోదావరిమండల చరిత్రలో (Godavari District Gazatteer) వ్రాయబడక యుంటచే మరుగుపడి యున్నది. ఈనది పెద్దాపురము తాలూకాలో గాతులపూడిగ్రామ సమీపమున నుద్భవించి, అన్నవరము మీదుగా ప్రవహించి, తుని డివిజను గుండాపోయి సముద్రగామి యగుచున్నది. తుని డివిజనులో పంపానరమును దేవాల

యము గలదు. ఈనది యిప్పటికా నామముతో సీమండలమున రివిన్యూ, రహదారీశాఖల పరిపాలనములో వ్యవహరింపబడుచున్నది. కాబట్టి కాండ్యము శాసనములోని పొత్తపినాడు, పిఠాపురము శాసనములోని పొత్తపినాడు ఒకటియే యని నిరూపింపవచ్చును. కాండ్యము శాసనములో వెనుగునడెబ్బది, మీనుంబాకనాడు ఎవ్వియో చెప్పుటకు ఉపపత్తులు గోచరింపవు.

సామర్లకోటకు సమీపముననున్న చాళుక్య భీమవరములోని భీమేశ్వరస్వామి యాలయములోని క్రీ. శ. 1207 సంవత్సరమునకు చెందిన యొక శాసనములో సామహాదేవరకు నాగవంశోద్భవుడైన మన్నెరుసంక్యరాజు తన తండ్రియైన సెమ్మంగిరాజునకు ధర్మార్థముగా తననిజవృత్తియైన పొత్తపినాటిలోని నడుపూరు అమృతపడిసమ్పునకు ధారాపూర్వకము చేసి యిచ్చినట్లు కలదు. ఈ చాళుక్యభీమవరము సకటమంతనినాటిలోనిదని యిచ్చటి శాసనములలో గలదు. ఇచ్చటి శ్రీ భీమేశ్వర మహాదేవరకు, ఎక్కడనో కడపమండలములో నుండిన పొత్తపినాటిలోని గ్రామమును దేవుని అమృతపడికై యిచ్చుట సంభవించియుండదు. ఈ నడుపూరుగ్రామము గోదావరిమండలములోని పొత్తపినాటిలోనిదేయై యుండును. ఈ సంక్యరాజు ప్రోలునాడు నేలుచుండిన చాళుక్యమల్లపదేవునకు సామంతుడై, పొత్తపినా డేలుచుండెనని భావింపనగును. ఈ శాసనకాలమున కడపమండలములోని పొత్తపినాడును తెలుగు చోడులైన మధురాంతక పొత్తపిచోళ బిరుదాంకుడైన [సల్లసిద్ధయచోడు డేలుచుండెను. కావున నడుపూరుగ్రామము చాళుక్యభీమవర సమీప గ్రామములలో ప్రోలునాటిలోని గ్రామమేడైన గావలసియుండెను—

(సశేషము)

# ప్రాచీనకాలశిల్పచిత్రలేఖనములు

శ్రీ విశ్వనాథ నరసింహం, యం. ఏ. బి. ఇడి.,

వారి విలాసహాసాదులును మఱికొన్ని చిత్తరువులం జూడనగును. బుద్ధ భగవానుని జీవితచరిత్రము, ఆమహనీయుని పూర్వజన్మవృత్తాంతములం దెల్పు జాతకకథలును కొన్ని కుడ్యచిత్రంబుల నొప్పారుచున్నవి. మఱియు జంతువుల చిత్రములు మున్నగునవి చిత్రకారులు తమ యిచ్చవచ్చినవానిని చిత్రించియుండిరి.

మఱియు నాకాలమున జైనమతముకూడ ప్రబలముగా నుండుటచే జినదేవునివిగ్రహములు శిల్పరచనకు మార్గదర్శకముగా నుండెను. హిందూమతమే మూలముగాం గల్గినదైనను బౌద్ధమతమువలెనే జైనమతముగూడ హిందూమతమును సంస్కరించు నాదర్శముతో బయలుదేఱిన దనవచ్చును. చాలవఱకు బౌద్ధజైనమతసిద్ధాంతములు సమానోద్దేశములతోం గూడినవి. జీవునకుం బునర్జన్మములేని విముక్తియే రెండింటియాదర్శము. అయినను వారు ఆచరణాభ్యాసములలోం గొన్ని మార్పులతో వ్యవహరించుచుండిరి.

జినముని యనంబడువాండు మహావీరవర్ధనుండు. క్రీ. పూ. 600 సం॥ ఆతం డవతరించినట్లు తెలియుచున్నది. తపోనిష్ఠవలన నాతనికి జినుండను నామము సార్థకమయ్యె. ఆతని కార్గురు ప్రముఖశిష్యులుండిరి. మఱియు నిరువది నలుగురు జినులనంబడు ఋషులు గలరనియు భక్తులు వారినెల్లర వేరువేరువిధముల రూపించిరనియుం దెలియును. ప్రత్యేకచిహ్నములచే వారందఱ నేర్పరించుచుం గొన్ని జంతురూపములు కాని యలంకారవిశేషములు గాని హృదయపీఠములందుంచి శిల్పరూపముల నిర్మాణించిరి. మైసూరున కఱువదిమైళ్ళ దూరమునందు శ్రవణబలిగోల యనుతావున నొకబ్రహ్మాండమైన

శిలావిగ్రహమున్నది. అయ్యది దిగంబరవిగ్రహము. ముఖము ప్రశాంతముగా బుద్ధవిగ్రహములవలె నున్నది. దీర్ఘవిశాలము లగు శ్రోత్రేంద్రియములు ఉన్నతభుజస్కంధము అజానుబాహువులును గల్గి బుద్ధుని ప్రతిమానిర్మాణమువలెనే కాన్పించును. అది డెబ్బదియడుగుల యెత్తుగా నున్నది. ఆవిగ్రహసమీపమున జైనసంబంధమగు నారు దేవాయతనములున్నవి. దిగంబర శ్వేతాంబరభేదములు జైనులలో నుండెను. మహావీరుఁడు కొంతకాలము కఠోరవ్రతములతోడి తపఃక్లేశములకోర్చి దిగంబరుఁడయ్యెను. తరువాత దిగంబరశాఖకుఁ జెందిన జైనులు ఆచ్ఛాదనరహితులుగా నుండుటయు శ్వేతాంబరు లనఁబడు వారు శ్వేతవసనముల సంతతము ధరించుచుండుటయు సంప్రదాయమయ్యెను. మఱియు బౌద్ధులకంటె జైనుల హింసాసిద్ధాంతము నాచరణలోఁబెట్టినటులు తెలియును. ప్రతి సూక్ష్మజీవికిని జీవాత్మయుండు ననియు నాకారణమున నెట్టి స్వల్పజీవులనేని హింసింపరాదనియు వారి పరమసిద్ధాంతము.

కావ్యకళానిర్మాతలు స్త్రీరూపచిత్రణమునందును తదీయభావౌన్నత్యప్రకటనమునందును ప్రత్యేకశ్రద్ధాశక్తులు వినియోగించిరి. ఆదిశక్తి, పరాశక్తి మున్నగురూపము లనేకవిధములఁ జెప్పఁబడి సృష్టిస్థితిలయములకుఁ గారణభూతమైన దొకానొక దేవీమూర్తి యనెడి భావము వారిలోనుదయించి యుండును. అజంతాగుహల చిత్రరచనలలోఁగూడ స్త్రీ సౌందర్యభావనావిశేషచిత్రణములలోఁ జిత్రకారుల చాతుర్యము వెల్లడింపఁబడినది. పదునారవ గుహలో నవసానదశయందున్న రాజపుత్త్రిక చిత్రింపఁబడినది. రుజావికలయగు సుందరి పలువురు పరిచారికలచేఁ బరివేష్టింపఁబడియుంట మిగుల సొగసుగఁ జిత్రింపఁబడినది. ముఖములో స్ఫురించు సౌందర్యప్రశాంతములు క్రూరమృత్యువట్టి సౌందర్యవతిని మ్రింగుచున్నదే యనుభావము నుద్భవింపఁ

చేయును. ఇంచుమించుగా నట్టిదృశ్యమునే పదునేడవ గుహాలోఁ జిత్రికారులు వేఱురీతి నిర్మించిరి. అందొక మహారాజ్ఞి రుజాపీడితమై జీవితాశలేక భర్తృవక్షమునఁ జేరబడియున్నది. అచటకూడ ఆస్త్రీమూర్తి వదనోజ్జ్వల సౌందర్యమును మనోహరాకారమును మిగుల సౌకుమార్యములోఁ జిత్రింపఁబడినవి.

అజంతాచిత్రకారులు స్త్రీమూర్తులను కుసుమసుకుమారసౌందర్యవతులుగా రూపకల్పన మొనరించిరి. మొదటిగుహాలో రాణి వివిధ శృంగారవతులగు చెలికత్తెలతో నొకభిక్షుకునకు భిక్షాదాన మొనర్చుట హృదయంగమముగా నుండును. ఆ రీతిగనే స్త్రీజనంబులఁ బూలమాలలవలె గుంపులుగుంపులుగాఁ గొన్నియెడల శోభాయమానముగను మఱికొన్నితావుల సౌకుమార్యసౌందర్యసౌరభంబుల జాజ్వల్యమానప్రసూనములుగా రచియించిరి. ముస్తాబులోనున్న ముగ్ధలను విశ్రాంతిగొనుచు చేడెలు వెలందులను ముచ్చటలాడుకొను మోహనాంగులను నిలుచున్న నీటుకత్తెలను ఆనందరసాలంబనములగు నన్నివిధముల స్త్రీమూర్తులను జిత్రించిరి. తలత్రిప్పుటలోని తారళ్యమునుగూడ నాచిత్రకారులు నిపుణతతోఁ జూపిరి. పదునేడవగుహాలో జిత్రితమైన బిచ్చుకత్తె క్రమతరముగా నున్నది. సౌందర్యరహితముగా వారు సరసిజాక్షుల రూపకల్పన మూహింపరైరి. అజంతాగుహలొక్కొక్కటి యిఱువదియడుగుల చతురమగుట దాని వైశాల్యమూహింపనగును. అందు శిలాప్రతిమలు బుద్ధుని ప్రతిమాస్వరూపములును రంగులతోడను కుంచెలతోడను వ్రాయఁబడిన చిత్తరువులుగూడ నుండుటచే శిల్పచిత్రలేఖనములు రెండును కళోపాసకులు సమానముగా వృద్ధినొందించినట్లు తెలియుచున్నది. గుహలలోని కుడ్యచిత్రములే కాక మీఁదికప్పును స్తంభములును, చిత్రరూపముల మిగుల నానందము గొల్పును. మీఁదికప్పుపైఁ జిత్తరువులు లభించునవు పవిత్రకాంతు లేరీతిగా నిలువఁ

బడి రచన సాగించిరో యని వారి రచనాకౌశలమునకు మిగుల నచ్చెరువొందవును.

మఱియు నజంతాగుహ లన్నియు నేకకాలమునఁ దొలువఁబడినవి కావు. అవి కాలక్రమమున మతప్రచారాదులు కొనసాగిన సమయములలో నిర్మితములై యుండును. శిల్పచిత్రకారులు లెక్కకు మిక్కిలిగా నానారచనలు సాగించియుందురు కాని యొకేశిల్పి యట్టి వివిధరచనల సాగించియుండుట సంభవింపనేరదు. ఇన్ని పురాతన చిత్తరువు లొకచో నున్నట్లు మన హిందూదేశమునందేమి ప్రపంచమునందు మఱి యెచ్చోనైననేమి, యున్నవనుట సందేహాస్పదము.

వేదయుగమున స్వర్గలోకమునందే సంచరించిన శిల్పకళాధిదేవత బౌద్ధయుగమునాటికి స్వర్గధామమునుండి మర్త్యలోకమున కవతరించిన దని చెప్పవచ్చును. కాని మానవునకు మాత్రము సేవకావృత్తి చేయలేదు. కరుణాప్రపూర్ణపవిత్రహృదయమూర్తి యగు బుద్ధభగవాను నాశ్రయించిన దా శిల్పదేవత. కాని రాజభోగముల కాశించియైన నశోకచక్రవర్తి నాలంబనముగా నాశ్రయింపలేదు. నిశ్చలమగు బుద్ధదేవుని ధ్యానస్వరూపము నిర్వాణపదవిని వెల్లడించు ముఖవికాసము నానాటి శిల్పరచనలలోఁ గాంచనగును. దేశమునందంతట బుద్ధభగవానుని యాదేశములఁ బ్రచురించిన శిలాస్తంభము లెన్నియో కాన్పించును కాని వానిపై నశోకుని కొకప్రతిమనైన ఆనాఁడు ప్రతిష్ఠింపరైరి. శిల్పకారుల గౌరవించుటమూలమున రాజు లాకాలమున శిల్పవిద్యను పోషించిరి. కాని శిల్పవిద్య లానాఁడు రాజులకేని రాజాధిరాజులకేని దాస్య మొనరింపలేదని తెలియుచున్నది.

## ఎల్లోరా గుహలలో శిలాప్రతిమలు

అజంతాగుహలకు దక్షిణముగాఁ గొలఁదిమైళ్లదూరమున హిందువుల యాత్రాస్థలముగా నెంచఁబడు 'ఎల్లోరా' గుహలు నిర్మింపఁ

బడియున్నవి. అందలి శిల్పరచనలు చూపఱకు నేత్రానంద మొనరించి హృదయనైర్మల్య ముదయింపఁజేయును. సువిశాలములగు చావడులును నం దనేకవిధ శిలాప్రతిమా నిర్మాణములును కలవు. రెండవ గుహలో దక్షిణభాగమునందు బోధనానిమగ్నుఁడైన బుద్ధుని శిలారచనము గాంచనగును. మఱియు నచ్చోట మూఁగురు బుద్ధాకృతులు పద్మాసనముల నధిష్ఠించి యున్నట్లు కానవచ్చును. అట్లే తక్కటిగుహలలో నెల్ల బుద్ధవిగ్రహములును తదితరములైన దేవతావిగ్రహములును గోచరించును. కొన్నిచోట్ల హిందూమతసంబంధములైన శిల్పప్రతిమలు కాన్పించుచున్నవి. మహిషాసురమర్దని యగు శివాస్వరూప మొకగుహయందు వ్యాఘ్రివాహనమున నిర్మింపఁబడినది. అదుగ్రేశ్వరి సమీపమునందే లక్ష్మీదేవత పరివారముతో నాప్రచండరూపిణియగు దుర్గామహాదేవిపై శీతలామృతసేచన మొనరించునట్లు చిత్రింపఁబడినది. బ్రహ్మవిష్ణువులకంటె నధికమహిమాన్వితునిగా శివుని స్వరూపనిర్మాణము లింగాకారము, లింగపీఠాధిరోహణమును మఱికొన్నితావులఁ గాంచనగును. అటనట విష్ణుమూర్తి యవతారంబులగు వరాహవామనావతారంబులు శిల్పములఁ నున్నవి.

అన్నింటిలో మిక్కిలి యెక్కువ విశాలముగానుండి శిల్పకళానైపుణ్యమును వెలార్చునది కైలాసనాథాలయము. 'కైలాసగుహ' నాబడు నాగుహామధ్యంబున నిశ్చలనిర్మలంబైన, లింగపీఠాధిష్ఠంబైన కైలాసనాథుని లింగాకార మున్నది. మఱియు ననేకశివమూర్తులు, ఒకచో శివుఁడు పార్వతీసమేతుఁడుగా నున్నట్లును, మఱియొకచోట తాండవకేళీరభసార్భటుం డైనట్లును గోచరించును. మఱియొకచో కోణమున త్రిమూర్తి శిల్పరచనము కాన్పించును. అన్నిమూలలయందును శిలాప్రతిమ లనేకములు దృశ్యంబు లగును. అన్నింటిలో శివుని ప్రాధాన్యము, లింగాకార శిల్పరచనము నుత్కృష్టముగా నగపడును.

కైలాసనాథాలయము రాష్ట్రకూట రాజవంశములో మొదటి కృష్ణరాజుపరిపాలనంబున క్రీ. వె. 760 ప్రాంతమున నిర్మింపఁబడినట్లు నిదర్శనములు కాన్పించును. ఆరాజునకుఁ గైలాసనాథు డిష్టదేవ తైనట్లును ఆదేవుని సహాయసంపత్తిచే నాతఁడు దక్కాణమునకంతకు నధీశ్వరుండైన కతంబున నాతఁ డా దేవాలయ నిర్మాణమునకుఁ గడంగి నట్లు తెలియును. శిలానిర్మాణములఁ దన్నిటికంటె నియ్యది మిక్కిలి యుత్కృష్టమయిన శిలాచమత్కృతి గల్గియుండుట నిర్వివాదాంశము. హిందూదేశమునం దెచ్చోటనైన నిట్టి యపరూపశిల్పకళాప్రదర్శనము లేదని చెప్పవచ్చును. ముఖమంటపము సుమా రేబదిమూఁ డడుగులు వైశాల్యముకల్గి పదునారుస్తంభములతో నలరారుచున్నది. శివదేవుని వాహనంబగు నందీశ్వరుఁడు ముందరిభాగముననే సువిశాలస్థితి నమరింపఁబడెను. ఇందు స్నానఘట్టమున కనువుపడు తటాకనిర్మాణము మాత్రము నిర్మితముకాలేదు. యాత్రికు లెల్లరు వారి యఘమర్షణ స్నానము లాయాజలపాతములయందును పర్వతమున కించుక దిగువఁ బ్రవహించు స్రవంతియందు నాచరించుచుండిరి. దక్షిణదేశములో నెల్ల శైవారాధనమున కియ్యదియే కేంద్రస్థానముగా నాశతాబ్దములలో నుండియుండును. తరువాత ముసల్మానుల దాడులవలన నచటి భక్తు లితరప్రదేశములకు తరుమఁబడిరని తెలియుచున్నది. అయినను ఎల్లోరాగుహాలలోని కైలాసనాథాలయమునందు వ్యక్తీకరింపఁబడిన శిల్పకళావిన్యాసమే తరువాత నెల్లెడల నిర్మింపఁబడిన శివాలయములకు మాతృకగా నుండెననుట యేతత్ శిల్పకళానైపుణ్యమును వేయివిధముల వెల్లడించును.

ఆగుహాలలో జైనమతసంబంధములగు కొన్ని శిల్పనిర్మాణములు నిపుణశిల్పుల స్మరింపఁజేయును. శిల్పకళావిన్యాస మీప్రతిమలలో నెచటను కంటఁబడలేదు. ఆయా ప్రతిమలఁ దిలకించుచో జైనమతము

హిందూమతమున కత్యంతసన్నిహితముగా నగపడును కాని ఆయా శిల్పరచనములలో శివలింగార్చనము మాత్రము కానరాదు. జైన ఋషులు మహావీరుఁడు, పరసనాథుఁడు, గోమతిఋషి ముఖ్యముగా ననేకపర్యాయములు శిల్పరచనములలోఁ జూపఁబడియున్నారు. ఇంద్రుఁడు అతనిభార్య ఇంద్రాణియుఁగూడ నాశిల్పరచనలలోఁగానఁ బడును. ఇంద్రుఁడు ఇంద్రాణి శిల్పరూపములు హిందువులకుగూడ నర్చనీయములు. అయినను వానిలో మహావీరుఁడు జైనులకెల్ల ముఖ్యదైవముగా నగపడును. అందుచే నాతని ప్రతిమానిర్మాణము పెక్కుసారు లగపడుచున్నది. అతని పీఠమునకు మధ్యభాగమున నొక సింహరచన ముండుట యొక ప్రత్యేకవిశిష్టతగాఁ గాన్పించును. ఈప్రకారముగా ఎల్లోరాగుహాలలో శిలాప్రతిమల శిల్పరచనానైపుణ్యము వ్యక్తమగును. అందలి ముఖ్యాంశ మెద్దియనఁ బ్రాచీన హైందవదేవతామూర్తుల శిలావిగ్రహములును, తరువాత నవతరించిన బుద్ధదేవునియొక్కయు జైనమహావీరునియొక్కయు శిలావిగ్రహములనుగూడ నచ్చోట నుండుటయే. దీనివలనఁ దెలియఁదగు సాధారణవిషయ మేమియన ఆయామతములకుఁ జెందిన కళోపాసకులెల్ల రాయాకాలములయం దుండి యాశతాబ్దులలో నట్టి శిల్పముల నిర్మించిరని తెలియనగును.

సాంచీస్థూపము బౌద్ధయుగములో శిల్పకళాచాతుర్యమును బ్రకటించు మఱియొక నిదర్శనము. ఇది మాళవమునకు ముఖ్యపట్టణమగు విదిశానగరమునకు సమీపముగా నొకకొండపయి నిర్మింపఁబడినది. అశోకచక్రవర్తి కాలమున నచట నొక బుద్ధవిహారము కట్టఁబడినది. చక్రవర్తిమతాదరణమూలమున నచటి బౌద్ధసంఘ మెంతయు ధనాదాయగౌరవాదులఁ బొందుచుండెను. మౌర్యవంశానంతరము కొన్నిశతాబ్దములవఱకును సాంచీక్షేత్రము బౌద్ధవిశ్వవిద్యాలయముగా

నుండినట్లు క్రీ. పూ. మూఁడవశతాబ్దమునుండి క్రీ. వె. పండ్రెండవ శతాబ్దమువఱకును గానుపించు శిల్పనిర్మాణముల శిథిలములవలనఁ దెలియుచున్నది. ఆనాఁడు నలందావిశ్వవిద్యాలయముకూడ ప్రాముఖ్యతహించిన మఱియొక విద్యాపీఠము.

సాంచీస్తూపమునకు నాల్గుముఖద్వారములున్నవి. అర్చనాదికముల ముగించుకొనిన తైర్థికులు దక్షిణద్వారమునుండి నిర్గమించుచుండిరి. బుద్ధుని పూర్వజన్మవృత్తాంతములఁ దెలుపు జాతకకథా భాగములు కొన్ని శిల్పనిర్మాణము నొందినవి. అశోకుని రాజ్యపాలనలోని కొన్నిఘట్టములుకూడ నక్కడక్కడ చిత్రింపఁబడినవి. ఒకద్వార శిఖరమున ఆర్గురు పురాజన్మలలోని బుద్ధులు నేడవ బుద్ధావతారునింగూడి సప్తబుద్ధస్వరూపచిత్రణమునఁ గాన్పించును. తక్కటిద్వారములన్నియు నానా జాతకకథలతో నిండియున్నవి. ఆ జాతకకథలలో ననూయవహించు నంతఃపుర కాంతల ప్రవర్తనౌన్నత్యము, ఆరుదంతములతోడి దంతావళము గాథయును ముచ్చటగొల్పునవి. బుద్ధదేవుఁడే పూర్వజన్మమున నాషట్దంతదంతియైన వాఁడు. అతఁడు గజయూథంబున కధినాథుఁడై యిరువురు భార్యలతో నుండెను. అట్టిచో ననూయాగ్రస్తయగు భార్య బుద్ధునిప్రార్థించి కాశీపట్టణ మహారాణిగా నామె జన్మించవలెనని కోరెను. అతఁ డటులే యనుగ్రహించెను. వారణాశి రాణి యైనంతనే యామె రాజసేనానాయకుని పిలిపించి యాయదంతములతో నుండిన మత్తేభరాజమును సంహరించి యందులకు నిదర్శనముగా నాదంతముల ఛేదించి తెమ్మని యాజ్ఞాపించెను. వేటకొఱకేగిన సేనాని కావివసనముల ధరించినవాఁడై గజరూపుఁడైన బోధిసత్త్వుని బాణఘాతమున నొప్పించెను. వెంటనే యా విజ్ఞానవంతమగు మృగరాజము తనదంతావళముల ఛేదించుట కియ్యకొనెను. ఇతర దంతావళము లచటకు వచ్చులోపలనే గజాధినాథుఁ డసువుల వీడెను.

(సశేషము)

